మననం చెయ్యాలి. తన తోటి విద్యార్థులతో ఈ విషయాలు చర్చించాలి. అలా చర్చించి అనుమానాలు లేకుండా విషయాన్ని స్థిరపరచు కోవాలి. జీవాత్మా పరమాత్మా రెండూ ఒకటే అనే విషయాన్ని తెలుసుకోవాలి. ఇదే **జ్ఞానసముపార్జన.**

వేదాంత విషయాలు చదివినా, గురూపదేశం విన్నా, సహాధ్యాయులతో చర్చించినా అజ్ఞానం వదలకపోతే, జీవాత్మా పరమాత్మా ఒకటే అని తెలియక పోతే – వేదాంత శాస్త్రాలు మళ్ళీ చదవాలి. గురూపదేశం మళ్ళీ వినాలి. ఇలా ఎంత కాలం వినాలి? అనే ప్రశ్న వస్తుంది. ఇక్కడ చిన్న ఉదాహరణ. పరీక్ష వ్రాశావు. ఉత్తీర్ణుడవు కాలేదు. మళ్ళీ అదే క్లాసు వదలాలి. పరీక్ష వ్రాయాలి. ఇలా ఎంత కాలం వ్రాయాలి. అంటే ఉత్తీర్ణత సాధించేదాకా. తెల్లటి వస్త్రం మీద మరక పడ్డది. దాన్ని శుభ్రం చెయ్యాలి. సబ్బుపెట్టి ఉతికాం. ఇంకా మరక ఉంది. మళ్ళీ ఉతుకు. ఇలా ఎంత కాలం? అంటే మరకపోయేదాకా. నీకు కావలసింది సాధించేదాకా ఇలా చెయ్యాల్సిందే. అలాగే వేదాంత వాక్యాలు మనసుకు పట్టేదాకా చదవాలి. ఏ మాత్రం అనుమానం లేకుండా, జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే అనే విషయం ఖచ్చితంగా తెలిసేదాకా, అజ్ఞానం అంతరించేదాకా గురూపదేశం వినాల్సిందే.

సాధకుడు 'నువ్వే పరబ్రహ్మావు' అని ఎన్నిసార్లు శాస్త్ర ప్రామాణికంగా చెప్పినా నమ్మడు. ఇదే అజ్ఞానము. బజారులో ఒక మామిడిపండు కొన్నాం. అది చూడటానికి చాలా బాగుంది. రుచిగా కూడా ఉంది. అయితే కొద్ది రోజుల క్రితం అది కాయ. పుల్లగా ఉంది. ఇంకొంత కాలక్రితం – పింద వగరుగా ఉంది. ఇంకొంతకాలం – అది పువ్వు. ఇంకొంత కాలం క్రితం – అది మొగ్గ. మొదట్లో ఉన్న మొగ్గే క్రమేణా పరిపక్వత చెంది ఇవాళ్ళ తియ్యటి పండు అయింది. పండిన తరువాత వేప పండైనా తియ్యగానే ఉంటుంది. అలాగే విపరీతమైన సాధన చేస్తే, ఎంతటి వాడైనా మహాజ్ఞాని అవుతాడు ఇందులో సందేహం లేదు. ఒకవేళ అతడికి తత్త్వం బోధ పడలేదు అంటే, సాధన సరిపోలేదన్న మాట. అన్నం సరిగా ఉడకలేదు అంటే, క్రింద మంట సరిగా లేదని తెలుసుకోవాలి. అందుకే తత్త్వం బోధపడేదాకా గురూపదేశం పొందుతూనే ఉండాలి. మామిడికాయని తెచ్చి గడ్డిలో పెట్టాం. అలా ఎంత కలం ఉంచాలి? అంటే – ఆ కాయ పండేదాకా. అలాగే తత్త్వం బోధపడేదాకా, జీవాత్మా పరమాత్మా ఒకటే అని తెలిసేదాకా ఈ శిష్యరికం చెయ్యాల్సిందే. గురూపదేశం పొందాల్సిందే. ఇందులో సందేహం లేదు.

మానవుడు చాలా పెద్ద అజ్ఞాని. అసత్యమైన విషయాలు తేలికగా నమ్ముతాడు. నిజాన్ని మాత్రం నమ్మడు. నీ జ్ఞాతులు ఎవరో మరణించారు. నీకు సూతకం వచ్చింది. అంటే చాలా తేలికగా నమ్ముతాడు. సూతకము అనేది కంటికి కనిపించదు. కాని దాన్ని చూసినట్లే భావిస్తాడు. అందరితోను నాకు సూతకం వచ్చింది అని చెబుతాడు. కాని నువ్వే పరబ్రహ్మ స్వరూపానివి అని సప్రమాణంగా చూపినా నమ్మడు. అజ్ఞానులు చెప్పే మాటలు అతితేలికగా నమ్ముతాడు. జ్ఞానులు చెప్పే మాట నమ్మడు. వేదాలు చెప్పే విషయాన్ని నమ్మడు. బ్రహ్మసత్యం-జగన్మిథ్యా అనే మాటను మాత్రం నమ్మడు. ఎన్ని ఉపదేశాలు చేసినా, ఎన్ని ప్రమాణాలు చూపించినా సత్యాన్ని మాత్రం నమ్మడు.

చరాచర జగత్తు ఎలా ఆవిర్భవించింది? అనే ప్రశ్నకు సమాధానంగా అనేక మతాలవారు అనేక వాదనలు వినిపించారు. వాటిలో ప్రధానమైనవి రెండు 1. ఆరంభ వాదము 2. పరిణామవాదము

**ఆరంభవాదంలో** మొదటగా ఉన్న వస్తువు తన లక్షణాలు ఏవీ చెడకుండా, ఇంకొక వస్తువుగా రూపు చెందుతుంది. దారపు పోగులన్నీ కలిపి వస్త్రంగా ఏర్పడతాయి. ఇందులో ఆరంభంలో ఉన్న లక్షణాలు పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలు పోగులు వస్త్రంగా ఏర్పడ్డప్పుడు నూలుపోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు, వస్త్రం వేరు. **పరిణామవాదం**లో వస్తువుకు ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలుతోడువేస్తే పెరుగవుతుంది. కాని పెరుగులో పాల లక్షణాలు, రూపము ఉండవు. అయితే జగత్తు ఈ రెండు విధాలుగాను ఆవిర్భవించలేదు. **వివర్తము** వల్ల వచ్చింది. వివర్తము అంటే భ్రాంతి; భ్రమ అసలు ఇక్కడ జగత్తే లేదు. జగత్తు ఉన్నది అని నువ్వు భావిస్తున్నావు. ఇదంతా నీ భ్రమ. రజ్జు సర్పభ్రాంతిలాగా అంటే మసక చీకట్లో త్రాడునుచూసి పాము అనుకున్నట్లుగా, భ్రాంతి చేత నామరూపాత్మకమైన జగత్తును ఊహిస్తున్నావు. ఈ రకమైన భ్రాంతి పోవాలంటే - సద్గురువు యొక్క ఉపదేశం కావాలి అది ఎంతవరకు? అంటే నీ **అజ్ఞానము నశించే దాకా గురూపదేశం కావాల్సిందే.**

# 5. షడంగాలు

కృష్ణయజుర్వేదానికి సంబంధించినది **శుకరహస్యోపనిషత్తు.** బ్రహ్మ మానసపుత్రుడు - వశిష్ఠుడు. వశిష్ఠుని కుమారుడు-శక్తి. శక్తి కుమారుడు - పరాశరుడు. పరాశరుని కుమారుడు-వ్యాసుడు. వ్యాసుని కుమారుడు-శుకుడు. వ్యాసమహర్షి తన కుమారుడైన శుకుడికి ఉపనయనం చెయ్యాలి అనుకున్నాడు. ఉపనయన సమయంలో సాధారణంగా తండ్రే కుమారుడికి బ్రహ్మోపదేశం చేస్తాడు. కాని ఇంకెవరైనా గొప్పవాడు గనక బ్రహ్మోపదేశం చేస్తే తన కుమారుడు కూడా గొప్పవాడవుతాడు అని భావించాడు వ్యాసుడు. ఎవరితో బ్రహ్మోపదేశం చేయించాలి? అని ఆలోచించాడు. అప్పుడు ఒక చిన్నఆలోచన వచ్చింది వ్యాసుడికి. సాక్షాత్తు సదాశివుడే బ్రహ్మోపదేశం చేస్తే బాగుంటుంది కదా? అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా సదాశివుడి దగ్గరకు వెళ్ళి.

**దేవదేవ మహాప్రాజ్ఞ ! పాశచ్ఛేద ధృఢవ్రత ।**
**శుకస్య మమపుత్రస్య వేదసంస్కార కర్మణి ॥**
**బ్రహ్మోపదేశ కాలో౽యమిదానీం సముపస్థితః ।**
**బ్రహ్మోపదేశః కర్తవ్యో భవతా౽ద్య జగద్గురో ॥**

"ఓ దేవదేవా ! ఓ ప్రజ్ఞానిధీ ! సంసార బంధనాలను త్రెంపగలిగే ఓ మహానుభావా ! నా కుమారుడైన శుకుడికి ఉపనయనము చెయ్యాలి అనుకుంటున్నాను. ఆ సమయంలో నువ్వే వచ్చినా కుమారుడికి బ్రహ్మోపదేశం చెయ్యవలసింది" అని ప్రార్థించాడు. ఆ మాటలు విన్న సదాశివుడు.

**మయోపదిష్టే కైవల్యే సాక్షాద్బ్రహ్మణి శాశ్వతే ।**
**విహాయ పుత్రో నిర్వేదాత్ ప్రకాశం యాస్యతి స్వయమ్ ॥**

"ఓ మునీంద్రా ! నేను గనక బ్రహ్మోపదేశం చేస్తే, నీ పుత్రుడు విరాగియై నిన్ను విడిచి వెళ్ళిపోతాడు. అతడికి కైవల్యం ప్రాప్తిస్తుంది. అది నీకు సమ్మతమేనా?" అన్నాడు సదాశివుడు. ఆ మాటలు విన్న వ్యాసుడు "ఓ దేవా! ఉపనయన సమయంలో

మీరు బ్రహ్మోపదేశం చేసిన తరువాత ఏం జరిగినా నాకు సమ్మతమే. అతడు నన్ను వదలి దూరంగా వెళ్ళిపోయినా, నా కళ్ళు ఎదుటే మోక్షం పొందినా కూడా నాకు సమ్మతమే" అన్నాడు. ఆ తరువాత సదాశివుడు స్వయంగా శుకుని యొక్క ఉపనయనానికి విచ్చేసి, అతడికి బ్రహ్మోపదేశం చేశాడు. ఇప్పుడు శుకుడు సదాశివుడికి నమస్కరించి 'ఓ దేవా ! నాకు బ్రహ్మోపదేశం చేవావు. మహావాక్యాల అర్థం కూడా వివరించావు. ఇప్పుడు ఆ మహావాక్యాలను షడంగాలతో సహా నాకు ఉపదేశం చెయ్యవలసింది అని ప్రార్థించాడు. అప్పుడు సదాశివుడు మహావాక్యాలను షడంగాలతోను శుకుడికి ఉపదేశం చేవాడు.

ఇక్కడ ఒక్క మాట గుర్తుంచుకోవాలి. 1.ఋషి 2.ఛందస్సు 3.దేవత 4.బీజము 5.శక్తి 6.కీలకము. ఈ ఆరింటినీ షడంగాలు అంటారు. షడంగాలు లేకుండా ఏ మంత్రాన్ని జపం చేసినా, అది సిద్ధించదు. **వీటిని గురువు ద్వారా మాత్రమే చెప్పుకోవాలి. పుస్తకం చూసి చదవరాదు.** బ్రహ్మజ్ఞాన సముపార్జన చేసిన వారికి మంత్రజపము, క్షేత్రాలు దర్శించటము, తీర్థాలు సేవించటము అవసరం లేదు. మహావాక్య విచారణ వల్ల వంద సంవత్సరాలు ఆయుష్యు కలుగుతుంది. ఒక్కసారి మహావాక్య జపం చేస్తే పూర్ణాయుష్యు కలుగుతుంది. మహావాక్యాలు నాలుగు. ఈ నాలుగు వాక్యాలను కలిపి ఒకేసారి జపం చెయ్యటం జరుగుతుంది. అందుకని ముందుగా నాలుగు మహావాక్యాలు కలిపి చెబుతున్నారు.

అస్యశ్రీ మహావాక్య మహామంత్రస్య । హంస ఋషిః । అవ్యక్త గాయత్రీఛందః పరమహంసోదేవతా । హం బీజం । సః శక్తిః । సోహం కీలకం. మమ పరమహంస ప్రీత్యర్థే జపే వినియోగః

**న్యాసము :**

**సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ**
**నిత్యానందోబ్రహ్మ**
**నిత్యానందమయం బ్రహ్మ**
**యోవై భూమా**
**యోవై భూమాధిపతిః**
**ఏకమేవాద్వితీయం బ్రహ్మ**

**ధ్యానం :**

**నిత్యానందం పరమశుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతమ్**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥**

**మంత్రం :**

**ఓం ప్రజ్ఞానం బ్రహ్మ । ఓం అహం బ్రహ్మాస్మి ।**
**ఓం తత్త్వమసి । ఓం అయమాత్మా బ్రహ్మ ॥**

**తత్త్వమసి** అనే మహావాక్యం ఛాందోగ్యోపనిషత్తులోది. ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ ఈ వాక్యాన్ని చెబుతాడు. తత్త్వమసి అనే మహావాక్యంలో మూడు పదాలున్నాయి. 1.తత్ 2.త్వం 3.అసి. తత్ అంటే – అది. త్వం అంటే – నీవు. అసి అంటే – అయి ఉన్నావు. అది అంటే పరమాత్మ నువ్వు అంటే – జీవాత్మ. ఓ శ్వేతకేతూ అదే నువ్వు అయి ఉన్నావు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. శ్వేతకేతూ ! నువ్వే పరమాత్మ స్వరూపానివి.

శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో ఉన్న తేజస్సు ఏదయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఆకాశంలో ఉన్న చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. అతనిలో ఉన్న చల్లదనం ఏదైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతిపదార్థంలోను, వస్తువులోను, జీవిలోను ఉన్న ప్రకాశము, శక్తి అన్నీ నీలోనే ఉన్నాయి. **తత్త్వమసి.**

సూర్యకాంతిలో ప్రకాశించే రూపాన్ని కన్ను ఎలా చూడగలుగుతున్నదో, బ్రహ్మ పదార్థముచే ప్రకాశించే జగత్తును మనస్సు ఎలా తెలుసుకుంటుందో, ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులోని అన్ని పదార్థాలకన్న అధికమైనది త్రికాలములందు ప్రకాశిస్తూ, జగత్తును ప్రకాశింపచేసేది బ్రహ్మము అదే నీవు. **తత్త్వమసి.**

దేనిని పొందిన తరువాత ఇంద్ర పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానానికి మించిన జ్ఞానం ఇంకొకటి లేదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాసి. జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

మూడు అవస్థల యందు జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

స్వప్నంలో నేను అని భావించేది, జాగ్రదావస్థలో నేను, నాది అనిపించేది, నేను అంటే ఈ దేహము కాదు అని చెప్పేది, నిర్మలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

శరీరత్రయము, గుణత్రయము, అవస్థాత్రయము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ దేనితోను సంబంధం లేనిదే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

చరాచర జగత్తులో అన్నింటికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆద్యంతములు లేనిది, సర్వవ్యాపి, దేశకాల భేదములు లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

జ్ఞానమే స్వరూపంగా గలది, అహంకారం లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆదిమధ్యాంతములు లేనిది, శాశ్వతమైనది, అహంకారము లేనిది, నిశ్చలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

నువ్వు స్థూలశరీరానివి కాదు, సూక్ష్మశరీరానివి కాదు. కారణ శరీరానివి అంతకన్నా కాదు. నువ్వు సర్వాంతర్యామివి. పంచకోశాలలో ఉన్న జ్ఞానరూపానివి. నీవే పరబ్రహ్మవు. **తత్త్వమసి.**

జనన మరణాలు, కులగోత్రాలు, చతురాశ్రమాలు, చాతుర్వర్ణాలు, ఏవీ లేనిది, సర్వానికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

అజ్ఞానము, జడత్వము, జాగు చెయ్యటము, మూర్ఛ, నిద్ర, భ్రాంతి మొదలైన శరీర ధర్మాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

కర్తృత్వ భోక్తృత్వాలు. అహంకార మమకారాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఏ మాత్రము అజ్ఞానము లేని జ్ఞానరాసియే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

వికారశూన్యుడైన పరబ్రహ్మకు సంసార బంధాలు లేవు. వాటి నుంచి విముక్తి అంతకన్నా లేదు. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులో కనుపించే అన్ని పదార్ధాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు, నామరూపాలున్న ప్రతివస్తువు, ప్రతిప్రాణి, ప్రతిఅణువు పరబ్రహ్మమే. అదే నీవు. **తత్త్వమసి.**

వేదం కూడా దృశ్యమానమైనదంతా బ్రహ్మమే అని చెబుతోంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతివస్తువులోను, ప్రతి ప్రాణిలోను ఉన్న శక్తి, ప్రకాశము అంతా నీలోనే ఉన్నది. అదే నీవై ఉన్నావు. చరాచర జగత్తంతా వ్యాపించిన పరబ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

ఈ విషయాలు తెలుసుకుని మనసుతో కల్పించబడిన భేదాన్ని నాశనం చేసి బ్రహ్మానందంతో స్వస్వరూపమునందే విహరించవలసింది. భేదాలన్నీ పోయి జగత్స్వరూపంతో ఆత్మయందు బ్రహ్మానందంతో ఉండవలసింది. అని చెప్పాడు ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు తత్త్వమసి అనే మహా వాక్యానికి అర్ధం సద్గురువు ద్వారా చెప్పుకోవాలి. గురుగీతలోని ఈ శ్లోకాలు చూడండి.

**అఖండ మండలాకారం । వ్యాప్తం యేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

సమస్త చరాచరములందు వ్యాపించి ఉన్న 'తత్' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపచేయు సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించత్సచరాచరం ।**

**త్వం పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

స్థావర జంగమాత్మకమైన జీవోపాధుల యందు వ్యాపించి ఉన్న 'త్వం' పదమని చెప్పబడుచున్న జీవస్వరూపాన్ని దర్శింపచేసే  సద్గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం - త్రైలోక్యం సచరాచరం**

**అసిత్వం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

త్రిలోకముల యందు చిద్రూపంగా వ్యాపించిఉన్న చైతన్యాన్ని 'అసి' పదం ద్వారా దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

ఈ రకంగా ప్రత్యగాత్మకు బ్రహ్మమునకు భేదం లేదని సద్గురువు ద్వారా తెలుసుకోవాలి.

ఇప్పుడు తత్త్వమసి అనే మహావాక్యాన్ని చూద్దాం. దీన్ని మొత్తం మూడు మంత్రాలుగా చెప్పుకొని ఉపాసన చెయ్యాలి. తత్, త్వం, అసి. ఇప్పుడు మొదటిదైన "తత్" పదాన్ని చూద్దాం.

అస్యశ్రీ తత్పద మహామంత్రస్య । హంస ఋషిః । అవ్యక్త గాయత్రీ ఛందః । పరమ హంసో దేవతా । హం బీజం । సః శక్తిః । సోహం కీలకం । మమసాయుజ్య ముక్తి సిద్యర్థే తత్పద జపే వినియోగః.

**న్యాసము :**

1. తత్పురుషాయ నమః 2. ఈశానాయ నమః 3. అఘోరాయ నమః 4. సద్యోజాతాయ నమః 5. వామదేవాయ 6. తత్పురుష ఈశాన అఘోర సద్యోజాత వామదేవ దేవేభ్యో నమః

**ధ్యానమ్ :**

**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యా దతీతం**

**శుద్ధం బుద్ధం ముక్తిమప్యవ్యయం చ**

**సత్యం జ్ఞానం సచ్చిదానందరూపం**

**ధ్యాయాద్దేవం తన్మహో భ్రాజమానం ॥**

**మం॥  ఓం తత్ స్వాహా**

అస్యశ్రీ త్వంపదం మహామంత్రస్య । విష్ణు ఋషిః । గాయత్రీ ఛందః । పరమాత్మా దేవతా । ఐం బీజం । క్లీం శక్తిః । సౌః కీలకం మమ ముక్త్యర్థే  త్వంపద జపే వినియోగః.

**న్యాసము :**

1. వాసుదేవాయ 2. సంకర్షణాయ 3. ప్రద్యుమ్నాయ 4. అనిరుద్ధాయ 5. వాసుదేవాయ 6. సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్నా నిరుద్ధేభ్యః

**ధ్యానమ్ :**

**జీవత్వం సర్వభూతానాం సర్వత్రాఖండ విగ్రహమ్**
**చిత్తాహంకార యంతారం జీవాఖ్యం త్వం పదం భజే ॥**

**మంత్రం : ఓం త్వం స్వాహా**

3. అస్యశ్రీ అసిపద మహామంత్రస్య । మన ఋషిః । గాయత్రీ ఛందః । అర్ధనారీశ్వరో దేవతా । అవ్యక్తాదిర్బీజం । నృసింహ శక్తిః । పరమాత్మా కీలకం । జీవబ్రహ్మైక్యార్థే అసిపద జపే అసిపద వినియోగః.

**న్యాసము :**

1. పృథ్వీద్వ్యణుకాయ 2. అబ్ద్వ్యణుకాయ 3. తేజోద్వ్యణుకాయ 4. వాయుద్వ్యణుకాయ 5. ఆకాశద్వ్యణుకాయ 6. పృథ్వివ్యస్తేజో వాయ్వాకాశ ద్వ్యణుకేభ్యో నమః

**ధ్యానమ్ :**

**జీవోబ్రహ్మేతి వాక్యార్థం యావదస్తి మనస్థితిః**
**ఐక్యం తత్త్వం లయే కుర్వన్ ధ్యాయే దసిపదం సదా ॥**

**మం॥ ఓం అసి స్వాహా**

తత్త్వమసి అనే వాక్యానికి అర్థం తెలిస్తే మిగిలిన మహావాక్యాలకు కూడా అర్థం తెలుస్తుంది.

మహావాక్యాలలో ఇప్పుడు మొదటి వాక్యానికి అర్థం చెబుతున్నారు. **ప్రజ్ఞానం బ్రహ్మ.**

1. **యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ**

**స్వాద్వస్వాదు విజానాతి తత్ ప్రజ్ఞాన ముదీరితమ్ ॥**

పరబ్రహ్మని చూస్తూ, పరబ్రహ్మని గురించి వింటూ, వాసన చూస్తూ, విస్తరింపచేస్తూ, మంచి చెడులను గ్రహించటమే ప్రజ్ఞానము అనబడుతుంది. అంటే సర్వకాల సర్వావస్థల యందు మనసా వాచా కర్మణా పరబ్రహ్మని గురించే ఆలోచిస్తూ, ఆ పరబ్రహ్మనే ధ్యానిస్తూ, చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. బ్రహ్మ ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతము అయినది. ఈ దృశ్యమానమైన జగత్తంతా మిథ్య. జగత్తులో ఉన్నది ఒక్కటే అదే పరబ్రహ్మ. అదే నేను అనే విషయాలు తెలుసుకోవటమే ప్రజ్ఞానము.

**చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు**

**చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి ॥**

చతుర్ముఖుడైన బ్రహ్మ, ఇంద్రాదిదేవతలయందు, మానవులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలయందు ఏ చైతన్యమైతే ఉన్నదో అదే పరబ్రహ్మము. అదే నేను **అహంబ్రహ్మాస్మి.** ఆ పరబ్రహ్మమే నేనై ఉన్నాను. ఆత్మస్వయం ప్రకాశమైనది. అయితే అహంకారపూరితమైన స్థూలశరీరము నందుండి జీవాత్మ అని పిలువబడుతున్నది. ఈ జీవాత్మ పరమాత్మ కన్న వేరుకాదు. అందుకే **అహం** అంటే జీవాత్మ, **బ్రహ్మము** అంటే చరాచర జగత్తంతా వ్యాపించిన పరబ్రహ్మ. **అస్మి**–అయి ఉన్నాను. నేనే పరబ్రహ్మనయి ఉన్నాను. అయమాత్మాబ్రహ్మ – నా ఆత్మయే (జీవాత్మయే) బ్రహ్మము అయి ఉన్నది. తత్త్వమసి – అదే నువ్వై ఉన్నావు. జీవాత్మ, పరమాత్మ రెండూ ఒకటే, మొత్తం మీద జీవాత్మ పరమాత్మ రెండు ఒక్కటే. అనేదే మహావాక్యాల అర్థం. దీన్ని గురుముఖతః మాత్రమే తెలుసుకోవాలి.

# 6.మనోనాశనము

శరీరంలో పదకొండు ఇంద్రియాలున్నాయి. జ్ఞానేంద్రియాలు-5, కర్మేంద్రియాలు-5, మనస్సు-1. వెరసి 11 ఇంద్రియాలు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఎక్కడ ఉంటాయి అనే విషయం అందరికీ తెలుసు. కాని మనసు ఎక్కడ ఉంటుంది? అనేదే పెద్ద ప్రశ్న. శరీరంలో మిగిలిన ఇంద్రియాలకు ఉన్నట్లుగా మనసుకు నిర్దిష్టమైన స్థానం లేదు. మనం ఏ ఇంద్రియంతో పనిచేస్తుంటే ఆ ఇంద్రియాన్ని ఆశ్రయించి ఉంటుంది మనసు. ఉదాహరణకు ఏదైనా ఒక దృశ్యాన్ని చూస్తున్నాము అనుకోండి. అప్పుడు మనసు దృష్టిలో ఉంటుంది. ఇష్టమైన సంగీతాన్ని వింటున్నప్పుడు మనసు శ్రవణేంద్రియంలో ఉంటుంది. పని చేస్తున్న ఆయా ఇంద్రియాలలో గనక మనసు చేరకపోయినట్లైతే, ఆ పని తృప్తికరంగా చెయ్యలేము. ఒక్కోసారి అసలు పనే పూర్తికాదు. కాబట్టి ఇంద్రియాలన్నింటిలోను చాలా ముఖ్యమైనది మనసు. సంకల్ప వికల్పాలకు కారణమైనది మనసు. మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము వీటిని అంతఃకరణ చతుష్టయం అంటారు. ఇందులో

| | | |
|---|---|---|
| మననం చేసేది | - | మనసు |
| నిశ్చయించేది | - | బుద్ధి |
| చింతించేది | - | చిత్తము |
| అహంకరించేది | - | అహంకారము |

మనసు ఎప్పుడూ ఖాళీగా ఉండదు. విశ్రాంతిగా ఉండదు. ప్రతిక్షణం ఏదో ఒక విషయఆలిన్ని ఆలోచిస్తూనే ఉంటుంది. గతంలో జరిగిన విషయాలు, ప్రస్తుతం జరుగుతున్నవి, భవిష్యత్తులో జరగబోయేవి, ఒక్కోసారి ఇలా జరిగితే బాగుంటుంది అని తీపికలలు కంటూ ఆనంద లోకాల్లో విహరిస్తుంది. కష్టాలకడలిలో పడి దుఃఖిస్తుంది. సుఖదుఃఖాలు అన్నీ ఈ మనసు ద్వారానే వ్యక్తమవుతాయి.

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన **అమృత బిందూపనిషత్తు**లో మనస్సును వివరించటం జరిగింది.

**మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవచ ।**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥**

మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండు రకాలు. కామసంకల్పాలు గలది అశుద్ధము. కామసంకల్పాలు లేనిది శుద్ధము.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**

**బంధయా విషయాసక్తం ముక్తైనిర్వషయగ్ం స్మృతమ్ ॥**

మానవుల బంధ మోక్షాలకు కారణం మనస్సు. విషయాసక్తి గల మనసు బంధాలవైపుకు, విషయాసక్తి లేని మనస్సు మోక్షం వైపుకు నడుస్తుంది.

**యతో నిర్విషయస్సాస్య మనసో ముక్తి రేవచ ।**

**అతోనిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥**

ఏ కారణం చేత విషయాసక్తము కాని మనసుకు మోక్షం చెప్పబడిందో, ఆ కారణం చేతనే ముముక్షువు యొక్క మనస్సుకు విషయ రాహిత్యం చెప్పాలి.

చరాచర జగత్తును సృష్టించేది మనస్సే. లయం చేసేది మనస్సే. సృష్టి అనేది రెండు రకాలుగా జరుగుతుంది. 1.వ్యష్టి సృష్టి 2.సమిష్టి సృష్టి

**1.వ్యష్టి సృష్టి :** ఇది గారడీవాడు చేసేది. గారడీవాడు సృష్టించిన వస్తువులు అతనికి కాక ఇంకా ఒకరిద్దరికే కనిపిస్తాయి.

**2.సమష్టి సృష్టి :** ఇది బ్రహ్మదేవుడు చేసిన సృష్టి. ఇందులోని వస్తువులు, జీవులు అందరికీ ఒకేలాగా కనిపిస్తాయి. బ్రహ్మదేవుడు కూడా తన మనస్సుతోనే సృష్టి చేశాడు అని గుర్తించాలి. అయితే అతడిది సమష్టి మనస్సు.

సంసారానికి కారణం మనస్సు. ఈ మనస్సు వల్లనే రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతున్నాయి. **మమ** అనుకుంటే బంధం. **నమమ** అనుకుంటే మోక్షం. నా భార్య, నా పిల్లలు, నా మిత్రులు, నా శత్రువులు అనుకోవటం వల్లనే ఈ బంధాలు ఏర్పడుతున్నాయి. అదే సంసారం. ఈ బంధాలను మానవుడు కావాలని తగిలించుకుంటున్నాడు. నేను లేకపోతే నా భార్య బ్రతకలేదు. నేను ఇంటికి వెళ్ళకపోతే మా కుక్కపిల్ల కూడా బిస్కట్లు తినదు. ఇవన్నీ బంగారు సంకెళ్ళు. కావాలని కోరి

మరీ తగిలించుకునేవి. చూడటానికి చాలా అందంగా కనిపిస్తాయి. మనస్సు లేనివాడికి బంధాలుండవు. పిచ్చివాడికి సంసార బంధాలుండవు. పసిపిల్లవాడికి కూడా ఈ బంధాలుండవు. వారిద్దరికీ మనసు, ఆలోచించే శక్తి ఉండదు. అలాగే ముముక్షువుకు కూడా బంధనాలు ఉండవు. సన్యాసం స్వీకరించిన వాడు అన్ని రకాల బంధనాలను వదిలేస్తాడు. అవధూత భోజనం కూడా చేయడదు. పిచ్చివాడిలాగా అడవుల వెంబడి పడి సత్యాన్వేషణలో తిరుగుతుంటాడు. కాబట్టి **మోక్షం కావాలంటే విషయ వాంఛలను పరిత్యజించాలి.** కామసంకల్పాలు లేని మనస్సు శుద్ధమవుతుంది.

**నిరస్త విషయాసంగం సంనిరుద్ధం మనోహృది ।**
**యదాయయాత్యాత్మనో భావం తధా తత్పరమం పదం ॥**

విషయముల యందు ఆసక్తిని వదలిన వెంటనే హృదయంలో మనస్సు నిరోధించబడి, ఆత్మరూపము పొందుతున్నది.

**తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృదిగతం క్షయమ్ ।**
**ఏతద్ జ్ఞానం చ ధ్యానం చ శేషోన్యాయశ్చ విస్తరః ॥**

హృదయంలో సంకల్పాలు నాశనమయ్యేదాకా మనసును నిరోధించాలి. ఇదే జ్ఞానము. ఇదే ధ్యానము. మిగిలినవన్నీ అనవసరమే.

సంకల్పాలు నాశనం చెయ్యటం, మనసులో విషయ వాసనలు నాశనం చెయ్యటం మనసును తన వశంలో ఉంచుకోవటం. మనసును జయించటము. "మనసును తన వశంలో ఉంచుకోగలిగిన వాడి ఇంద్రియాలు సమర్ధుడైన సారధి చేతిలోని అశ్వాలు లాగా అధీనంలో ఉంటాయి." అంటోంది **కఠోపనిషత్తు.** కాబట్టి ముముక్షువైన వాడు తన మనస్సును తన వశంలో పెట్టుకోవాలి. మనస్సును జయించాలి.

స్వప్నావస్థలో ఏ రకమైన విషయాలు లేకపోయినప్పటికీ జాగ్రదావస్థ లోని విషయాలను ఊహించుకున్నట్లే, తన జన్మాంతర సంస్కారము వల్ల మనస్సే జాగ్రదావస్థలో ఈ సంసారాన్ని కల్పిస్తున్నది. స్వప్నంలో విషయాలను సృష్టించినట్లే జాగ్రదావస్థలో ఈ జగత్తును సృష్టిస్తున్నది. జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలోని విషయాలను బ్రహ్మదేవుడు సృష్టించడు. కేవలము

మనసే కలను సృష్టిస్తుంది. అలాగే నామరూపాత్మకమైన జగత్తును కూడా ఈ మనస్సే సృష్టిస్తున్నది. ఈ సంసారమంతా మనసుచేతనే కల్పించబడుతోంది. నిజం చెప్పాలంటే అసలు జగత్తే లేదు. మనసు పనిచేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో ఈ సంసారం కనిపించదు. ఎక్కడైతే మనస్సు ఉన్నదో అక్కడే ముల్లోకాలు ఉంటాయి. మనసు లేకపోతే ఈ లోకాలే లేవు. మంచి చెడులకు, సుఖదుఃఖాలకు కారణం మనస్సు.

**'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'**

బంధ మోక్షాలకు కారణం మనస్సు. **మమ** అనుకుంటే బంధం **'నమమ'** అనుకుంటే మోక్షం. మనసుతోనే సంసారం సృష్టించబడుతున్నది. ఏ పదార్థం మీద మనకు ప్రేమ అభిమానం ఉంటుందో దాని స్వరూపంగానే మనసుంటుంది. ఇది మనసు యొక్క లక్షణం. మోక్షం కావాలి అంటే మనసును అదుపులో పెట్టుకోవాలి. మనసు ఎప్పుడూ అదుపులో ఉండదు. ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకి దూకుతూ ఉంటుంది. పరుగులు పెడుతుంది. ఇంద్రియాలు మనసు యొక్క అధీనంలో ఉంటాయి. మనసు సక్రమంగా ఉంటే ఇంద్రియాలు సక్రమంగానే ఉంటాయి. మనసు సక్రమంగా ఉండటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనల యందు చిక్కకుండా ఉండటం. ఎవరి మనసు విషయ వాసనల యందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనసును జయించినట్లే. అజ్ఞానాన్ని వదిలి జగత్తంతా బ్రహ్మమయము అని భావన చేయగలిగినవాడే మనసును జయించినవాడు. మనసును జయించటం తేలిక కాదు అంటారు. ఇది అజ్ఞానులు చెప్పే మాట. ఆత్మజ్ఞానం కల పురుషుడికి మనసును జయించటమనేదికళ్ళుమూసి తెరిచినంత తేలిక. 'సర్వవ్యాపకుడైన బ్రహ్మమును నేనే' అని భావించిన వాడి మనస్సు అతని అదుపులోనే ఉంటుంది. జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడినదే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు. అని తెలుసుకోవటమే మనోజయము. చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనసుతో భావించబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది.

ఈ రకంగా మనసును లౌకిక విషయాల యందు లగ్నం కానీకుండా కట్టడి చేసి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగినవాడే మనసును జయించిన వాడు. **మోక్షం కావాలంటే మనోనాశనము జరిగి తీరాలి.**

మనకు ఏ వస్తువు మీద, ఏ పదార్థం మీద ప్రేమ ఉన్నదో, దాని స్వరూపంతోనే ఉంటుంది మనసు. ఇలా ఉండి ప్రేమ, అభిమానము అనే పాశాలతో బంధించటం మనసు లక్షణము. శబ్దాది విషయాలకు చిక్కకుండా మనసును నిగ్రహించినవాడే మనసును జయించినవాడు. అయితే మనసును జయించటం తేలికైనవిషయమా? అనేది సందేహము. కాని ఆత్మజ్ఞానికి మనసును జయించటమనేది కళ్ళు మూసి తెరిచినంత తేలిక. నేను అంటే దేహంకాదు. ఇంద్రియాలు కాదు. నేను పరబ్రహ్మను అని నిశ్చయించుకున్న వాడిమనసు అతని అదుపులోనే ఉంటుంది. శబ్దాది విషయాలను జయించిన వాడి మనసు అతని అదుపులోనే ఉంటుది. జీవాత్మ పరమాత్మలకు తేడా లేదని తెలిసినప్పుడు మనసుకు సంకల్ప వికల్పాలుండవు. నువ్వు నేను, అది ఇది అనే జ్ఞానము లేని స్థితినే **అమనస్కస్థితి** అంటారు. ఇదే మనసు పనిచేయని స్థితి. జ్ఞాతజ్ఞానము అనే భేదాలు సృష్టించేది మనస్సే. ఆ మనస్సే గనక నశిస్తే సుషుప్తిలాగానే సమాధిలో కూడా భేదముండదు. భేదజ్ఞానము లేకపోవటమే మోక్షము. మనసును అదుపు చేయగలిగితే మోక్షం సిద్ధించినట్లే.

కాబట్టి మోక్షగామి అయినవాడు మనసును అదుపులో ఉంచాలి. మనసును జయించాలి. మనోనాశనం కావాలి.

# 7. మహావాక్యానుసంధానము

మహావాక్యాలను చదవటం, గురువు దగ్గర వాటిని చెప్పించుకోవటము, వాటి యొక్క అర్థం తెలుసుకోవటము ఒక ఎత్తు. వాటిని అనుసంధానం చెయ్యటం ఒక ఎత్తు. ఈ విషయమంతా ఋగ్వేదానికి సంబంధించిన **ఆత్మబోధోపనిషత్తు**లో వివరించబడింది.

అది అంటే – పరమేశ్వరుడు, ఇది అంటే – జీవేశ్వరుడు. ఈ రెండూ ఒక్కటే.

వీటి అర్థాలు తెలుసుకున్నంత మాత్రాన చాలదు. వీటిని అనుసంధానం చెయ్యాలి.

అనాత్మగా ఉన్న ఈ దేహాదులన్నింటి యందు ఉన్నటువంటి 'అహం', 'మమ' అనే భావానికి 'అధ్యాసము' అని పేరు. అధ్యాసము అంటే–తప్పుగా తెలుసుకోవటము, మిథ్యాజ్ఞానము అని అర్థం. విద్వాంసుడు ఈ మిథ్యాజ్ఞానాన్ని నిరస్త (తొలగింపబడినది, త్రోసివేయబడినది, వెళ్ళగొట్టబడినది) రూపంలో బ్రహ్మనిష్ఠతో జయించాలి. అంటే అహంకార మమకారాలు మిథ్య. కాబట్టి ఆ మిథ్యాజ్ఞానాన్ని బ్రహ్మజ్ఞానంతో జయించాలి. శరీరము, ఇంద్రియాలు వీటికన్న వేరైనదే ప్రత్యగాత్మ. అందుచేత ఈ ప్రత్యగాత్మ బుద్ధి మొదలైన వ్యాపారాలన్నింటినీ సాక్షిగా గ్రహించి, ఆ ప్రత్యగాత్మయే నేను అని తెలుసుకోవాలి. దేహము, ఇంద్రియాలే నేను అనే భ్రాంతిని వదలివెయ్యాలి. లోకానువర్తనము అంటే – లోకాన్ననుసరించి సంచరించటం. దేహానువర్తనము అంటే దేహాన్ననుసరించి సంచరించటం, శాస్త్రానువర్తనము అంటే – శాస్త్రాలలో చెప్పిన విధంగా నడచుకోవటం వీటిని వదలి, ఈ శరీరమే నేను అనే భ్రాంతిని వదలి వెయ్యాలి. లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన, దేహభ్రాంతులను పూర్తిగా పరిత్యజించాలి.

సాధకుడు స్వాత్మలో అంటే అతని ఆత్మలోనే స్థితుడై ఉండాలి. ఆత్మలో నివసించే వారికి మనస్సు నశించిపోతుంది. ఈ విషయం యుక్తి (తెలివి) స్వానుభూతి (తనయొక్క అనుభవము) శ్రుతులు (వేదమంత్రాలు, వేదవిజ్ఞానము) ద్వారా తెలుసుకోవాలి. శబ్దాదులను గౌరవించరాదు. ఆత్మను విస్మరించరాదు. అముక్త మార్గంలో నిద్రించరాదు. లోకవ్యవహారాలలో చిక్కుకోరాదు. సర్వదా ఆత్మధ్యానం మాత్రమే చెయ్యాలి. దీనివల్ల అనాత్మ (ఆత్మకానిది) బహిష్కరింపబడుతుంది.

తల్లిదండ్రుల మలినాలతో పుట్టి, మలమూత్రములతో కూడిన ఈ దేహము అపరిశుభ్రమైనది. అందుచేత అసహ్యకరమైన ఈ శరీరాన్ని దూరము చేసి (తనకన్న వేరుగా చేసి) బ్రహ్మను నేను అని భావించి కృతకృత్యుడు కావాలి. జీవాత్మ పరమాత్మలు వేరు అనే భావం కలిగినట్లైతే అది అజ్ఞానము. ఘటాకాశాన్ని మహదాకాశంలో లయం చేసినట్లుగా, అఖండభావనతో జీవాత్మను పరమాత్మయందు లయం చెయ్యాలి. అప్పుడు స్వయంప్రకాశముగాఉన్న ఆత్మతానే అవుతాడు. అందువలన తనచే, తననే తెలుసుకుని దేహరూపంలో ఉన్న పిండాండాన్ని, సృష్టి రూపంలో ఉన్న బ్రహ్మాండాన్ని మలభాండములాగా త్యజిస్తాడు. అనాదియైన అజ్ఞానముతో, దేహమే ఆత్మ అనే భావముతో దుఃఖము పొందుతున్నాడు. అందుచేత దేహాదులయందున్న అహం అనే బుద్ధిని ఆత్మయందు నిలిపి, సర్వదా కేవలము అద్వితీయ పరబ్రహ్మ అయి ఉంటాడు.

అద్దంలో కనిపించే అంతఃపుర ప్రతిబింబములాగా, ఏ పరబ్రహ్మయందు మిథ్యాజగత్తు కనిపిస్తున్నదో, ఆ బ్రహ్మమే నేను. అని నిశ్చయించుకుని, కృతకృత్యుడు కావాలి. అహంకారం లేనివాడికి అఖండస్థితి చేకూరుతుంది. స్వయంప్రభుడైన అతడు చంద్రునిలాగా విమలుడై, సంపూర్ణమైన ఆనందము పొందుతాడు. క్రియ గనక నశిస్తే చింతకూడ నశిస్తుంది. అప్పుడే వాసనాక్షయమవుతుంది. ఈ రకంగా వాసనా ప్రక్షాళనమే మోక్షము. అటువంటి స్థితే జీవన్ముక్తి. అన్ని ప్రదేశాలలోను, ఈ జగత్తునందంతటా, బ్రహ్మమాత్రముగా దర్శించటమే పరబ్రహ్మ సాక్షాత్కారము. ఇటువంటి భావనతోనే మనసులోపల ఉన్న వాసనలను జయించాలి. సర్వదా బ్రహ్మనిష్ఠయందు కొంచెము కూడా ప్రమాదం కలుగరాదు. ఈ ప్రమాదాన్ని బ్రహ్మవాదులైన మహర్షులు మృత్యువుగా పరిగణిస్తారు.

నీటిని ఆవరించి ఉన్న నాచును ప్రక్కకు నెట్టి వేసినప్పటికీ అది మళ్ళీ తానున్న చోటికే వచ్చి చేరుతుంది. అలాగే ప్రాజ్ఞుడు మాయను బయటకు పంపించినప్పటికీ, అతడు గనక బ్రహ్మనిష్ఠ నుంచి క్రిందికి జారినట్లైతే, ఆ మాయవచ్చి మళ్ళీ చేరుతుంది. దీనివల్ల అతని యోగనిష్ఠ భ్రష్ఠమవుతుంది. ఈ రకంగా ఎల్లప్పుడూ ఆత్మానుసంధానం చేస్తూ, జీవించినట్లైతే, అతడు బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు. అటువంటివాడు జీవన్ముక్తుడు. అతడు ఈ శరీరం వదలిన తరువాత కూడా ఆత్మస్వరూపుడై ఉంటాడు. భ్రాంతి లేనటువంటి సమాధిచేత ఆత్మసాక్షాత్కారము కలిగినప్పుడు, అజ్ఞానము

పూర్తిగా నాశనమవుతుంది. అప్పుడు **'అఖండ సచ్చిదానందమే తాను'** అని ధృవీకరించుకుని, అహంకారము మొ॥వి తాను అని భావించకుండా, వాటన్నింటినీ ఘటపటాదులలాగా ఉదాసీన భావంతో దర్శించాలి. పిపీలికాది బ్రహ్మపర్యంతము, ఈ ఉపాధులన్నీ మిథ్యా మాత్రములు కాబట్టి వాటన్నింటినీ ఉదాసీన భావంతో దర్శించటం మంచిది. ఈ రకంగా చేసి పూర్ణముగా ఆత్మని మాత్రమే తెలుసుకోవాలి. బ్రహ్మ, ఈశ్వరుడు, రుద్రుడు మొదలు ఈ విశాల విశ్వంలో ఉన్న ఉపాధి అంతా కూడా ఆత్మయే. ఆత్మకన్న వేరే తత్త్వము లేదు.

ఈ ప్రపంచమంతా అసత్య పదార్థమే. అదంతా తనయందే ఆరోపించబడి ఉన్నది. అటువంటి ఆరోపిత ప్రపంచాన్ని నిరసించగా, పూర్ణుడు, అద్వయుడు, క్రియారహితుడు అయిన పరబ్రహ్మ తానే అవుతాడు. ఈ విశ్వమంతా అసత్కల్పము, అవికల్పము అయిన ఉన్నది. వస్తువు ఒక్కటే అది అవికారము. అవిశేషము. నీ రూపం కూడా అదే. అందులో నీపేరు ఉండదు. దర్శించేవాడు, దర్శింపబడినది, దర్శనము. ఈ త్రిపుటి ఆ పరబ్రహ్మయందు లేదు. ఆ పరబ్రహ్మము నిరామయమై, నిర్విశేషమై ఉన్నది. పరిపూర్ణము, చిద్రూపము, శివము, అవిద్యారహితము, అద్వితీయము అయి ఉన్నది. నిర్విశేషమైన పరతత్త్వంలో నీ నామము (వస్తు భిన్న ప్రపంచము) ఎక్కడ ఉంది ? ఏకాత్మక పరతత్త్వంలో భేదం చూసే వారెవరు ? బ్రహ్మము అఖండమైనది. అందులో భేదాన్ని దర్శించేవాడు లేడు. ఈ భ్రాంతికంతటికీ మూలకారణము చిత్తము. ఆ చిత్తము గనక లేకపోయినట్లైతే ఈ జగత్తే లేదు. అందుచేత చిత్తాన్ని నిశ్చలమైన స్థితిలో ఉంచాలి. అప్పుడు ప్రత్యగ్రూప పరమాత్మ యందు ఐక్యమవటం జరుగుతుంది.

అఖండానంద స్వరూపమైన పరమాత్మ తనకన్నా వేరుగా లేదని అనుభవంలో ఉన్న బ్రహ్మజ్ఞానికి బహిరంతరములందు సదానంద రసాస్వాదనము కలుగుతుంది. వైరాగ్యానికి ఫలము జ్ఞానము. దీనివల్ల ఉపరతి ఫలము కలుగుతుంది. ఉపరతి అంటే కర్మలను పరిత్యజించటం. బాహ్యావిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటం. ఉపరతివల్ల **"స్వానందానుభవ మహాశాంతి"** అనే ఫలము లభిస్తుంది. వైరాగ్యము కలిగికూడా జ్ఞానం రాని పక్షంలో, ఆ వైరాగ్యము నిష్ఫలమవుతుంది. వైరాగ్యము, జ్ఞానము రెండూ కలిగి ఉపరతి కలగకపోతే, ఆ రెండూ నిష్ఫలమవుతాయి. **వైరాగ్యము, జ్ఞానము, ఉపరతి మూడూ కలిగి శాంతిని**

**పొందకపోతే - సర్వమూ నిష్ప్రయోజనమవుతుంది.** మాయోపాదికత్వము, జగత్కారణత్వము, సర్వజ్ఞత్వము, పరోక్షధర్మ విశిష్ఠత్వము, స్వరూప లక్షణాలవుతాయి. అటువంటి లక్షణాలు గల పరమాత్మయే మహావాక్యంలోని 'తత్' పదానికి అర్థం.. అంతఃకరణగలవాడై, అహం అనే తత్త్వానికి ఆధారంగా జీవుడు ప్రకాశిస్తున్నాడు. 'త్వమ్' అంటే చిదాభాసుడైన జీవుడే. జీవుడు ఆ బ్రహ్మముయొక్క ప్రతిబింబమే. ఈశ్వరుడు మాయాశరీరం గలవాడు. జీవుడు అవిద్యా శరీరం గలవాడు. ఇక్కడ **ఈశ్వరుడికి ఉపాధి అయిన మాయను, జీవుడికి ఉపాధి అయిన అవిద్యను వదలి వేసినట్లైతే, జీవుడు ఈశ్వరుడు ఒకటే అవుతారు. అప్పుడు అఖండ సచ్చిదానంద రూపమైన పరబ్రహ్మ దర్శనమవుతుంది.**

ఈ రకంగా మహావాక్యాన్ని అనుసంధానం చెయ్యటమే 'శ్రవణము'. విన్న విషయాన్ని యుక్తితో అనుసంధించటమే 'మననము'. వేదాంతార్థాన్ని శ్రవణం చేసి, మననం చేసినప్పుడు నిస్సంశయంగా తెలిసిన వస్తువునందు ప్రీతిని నిలిపి, దానియందు మనస్సు నిలిపి, తదేక ధ్యానం చెయ్యటమే 'నిధిధ్యానము' అనబడుతుంది. ధ్యాతను మరచి ధ్యానమును వర్జించి, ధ్యేయమైన గోచరమగు చిత్తాన్ని గాలిలేనిచోట ఉంచిన దీపంలాగా ఉంచటమే 'సమాధి. నిర్వికల్ప సమాధిలో ఆత్మగోచరాలయిన అజ్ఞానవృత్తులు ఉంటాయి. కాని అవి ఆ సమయంలో తెలియబడవు. సమాధి నుంచి బయటకు వచ్చినప్పుడు, వారికి స్మృతి రూపంలో ఉన్న అనుభవాన్ని బట్టి, వృత్తులను ఊహించటానికి వీలవుతుంది. అనాదిగా ఉన్న ఈ సంసారంలో కోట్లకొలది సంచితకర్మలున్నాయి. అయినప్పటికీ పైన చెప్పిన సమాధివల్ల ఆ కర్మలన్నీ నశించిపోతాయి. పరిశుద్ధమైన ఆత్మధర్మము అభివృద్ధి చెందుతుంది.

ఈ నిర్వికల్ప సమాధి వేలకొలది ధర్మరూపామృతధారలను వర్షిస్తుంది. కాబట్టి యోగవేత్తలు ఈ సమాధిని **'ధర్మమేఘము'** అంటారు. వాసనలే కర్మకు కారణం. నిర్వకల్ప సమాధివల్ల శుభాశుభవాసనలన్నీ పూర్తిగా నశించిపోతాయి. వాసనాక్షయం అవటంచేత పాపకర్మలు, పుణ్యకర్మలు అన్నీ నశించిపోతాయి. 'తత్ త్వం అసి' అనే మహావాక్యం సమాధి స్థితి లభించిన తరువాత అపరోక్షమైన ఆత్మసాక్షాత్కారాన్ని

ప్రసాదిస్తుంది. అనుభవించదగిన విషయ సుఖములయందు గల అపేక్షలు నశించి, అవి మళ్ళీ పుట్టకుండా ఉన్నట్లైతే, అటువంటి స్థితిని వైరాగ్యము అంటారు. ఆత్మయందు దాగి ఉన్న చిత్తవృత్తి బయటకు రాకపోయినట్లైతే, ఉపరతి ప్రాప్తించిందని భావించాలి. అలాకాకుండా పాండిత్యముతో వైరాగ్యము ప్రాప్తిస్తుందనుకోవటం కేవలం భ్రాంతి మాత్రమే. వైరాగ్యం లేకపోతే జ్ఞానం కలగదు. ప్రజ్ఞగలవాడే స్థిత ప్రజ్ఞుడు. ఎవడు ఆనందాన్ని అనుభవిస్తున్నాడో, ఎవడు బ్రహ్మయందు ఆత్మను విలీనం చేస్తున్నాడో, ఎవడు నిర్వికారుడో, నిష్క్రియుడో, అటువంటి యతి స్థితప్రజ్ఞుడు.

ఈశ్వరుడు తత్ పదార్ధమని, జీవుడు త్వమ్ పదార్ధమని లక్ష్యార్ధ భావంతో శోధించినట్లైతే జీవబ్రహ్మల ఏకీభావం కలుగుతుంది. అటువంటి ఏకరూప జ్ఞానరూపంలో ఉన్న చిన్మాత్ర వృత్తిని 'ప్రజ్ఞ' అంటారు. జీవాత్మ పరమాత్మల ఏకత్వ రూపజ్ఞానమే ఆకారముగా ఉన్న ప్రజ్ఞగలవాడే జీవన్ముక్తుడు. దేహము, ఇంద్రియాలే నేను అనే భావాన్ని విడిచిపెట్టి, ఆత్మ స్థితుడైనవాణ్ణి జీవన్ముక్తుడు అంటారు. తనకన్న పరబ్రహ్మ వేరుగాలేదని, మాయాకల్పిత జగన్నిర్మాణము పరబ్రహ్మ కన్న వేరుగా లేదని, ప్రజ్ఞతో తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. సాధువులు పూజించేటప్పుడు, దుర్మార్గులు పీడించేటప్పుడు కూడా సమభావంతో ఉన్నవాడే జీవన్ముక్తుడు. బ్రహ్మతత్త్వము తెలిసిన వ్యక్తి అందరిలాగానే సంసారమందున్నప్పటికీ, రాగద్వేషాలకు వశం కాకుండా అంతర్ముఖుడై ఉంటాడు. ఈ విషయం బ్రహ్మవేత్తలకు మాత్రమే తెలుసు. ఇప్పుడు అనుభవించే సుఖదుఃఖాల అనుభవమంతా ప్రారబ్ధానికి సంబంధించినది. ఈ ప్రారబ్ధాన్ని జ్ఞానికూడా అనుభవిస్తాడు.

కలనుండి మెలకువ వచ్చిన వెంటనే కలకరిగిపోతుంది. అలాగే మహావాక్యార్ధానుభవజ్ఞానంతో అనేక కోట్ల జన్మలయందు కూడబెట్టిన సంచితకర్మ పూర్తిగా నశిస్తుంది. ఆకాశానికి ఏ వస్తువుతోనూ సంబంధము లేదు. అలాగే తాను కూడా ఆకాశంలాగా ఉదాసీనుడను, అసంగుడను (సంబంధం లేనివాడను) అని తెలిసికొన్న యతికి కర్మలతో ఏ రకమైన సంబంధము ఉండదు. ఆ యతి ఆగామికర్మ (ప్రాప్తించేది) రహితుడు. ఆకాశానికి కుండతో సంబంధము ఉన్నప్పటికీ, అందులోని సారాయితో సంబంధం లేదు. అలాగే ఆత్మదేహమందున్నప్పటికీ, దేహధర్మాలతో

దానికి సంబంధంలేదు. విడువబడిన బాణము తన లక్ష్యాన్ని భేదించకుండా వదలదు. అలాగే జ్ఞానం రాకముందు ప్రారంభమైన ప్రారబ్ధకర్మను అనుభవించి తీరాలి. అది జ్ఞానంతో నశించదు. పులి అనుకొని బాణం వదిలాడు. కాని అది ఆవు. ఆవు బాణం తగిలి మరణిస్తుంది. అలాగే ప్రారబ్ధకర్మని అనుభవించాల్సిందే. అజరుడను, అమరుడను అనే స్థిరమైన బుద్ధి గలవాడికి ప్రారబ్ధకల్పన నిజంకాదు. బ్రహ్మనిష్ఠుడైన వాడికి ప్రారబ్ధ భోగాల అనుభవం సత్యంకాదు.

దేహమే ఆత్మ అనే భ్రాంతి ఉన్నవాడికి ప్రారబ్ధం ఉంటుంది. ఈ దేహము తాను కాదు అని నిశ్చయంగా తెలుసుకున్నవాడు తానే ఆత్మ అవుతాడు. మాయా కల్పితమైన ఈ దేహానికి ప్రారబ్ధకల్పన భ్రాంతి అవుతుంది. సత్యమైన దానికి జన్మము లేదు. నాశనములేదు. లేనటువంటి శరీరానికి ప్రారబ్ధం ఎలా వస్తుంది ? అందువల్ల పరమార్ధంలో ప్రారబ్ధంలేదు. జ్ఞానంవల్ల అజ్ఞాన కార్యాలన్నీ నశించినప్పుడు జ్ఞానియొక్క దేహము మాత్రము ఏ రకంగా స్థిరంగా ఉంటుంది ? అందువల్ల ప్రారబ్ధమనేది వ్యావహారిక సత్యమే గాని పారమార్ధిక సత్యంకాదు. పరబ్రహ్మము పరిపూర్ణము, అనాది, అనంతము, అప్రమేయము, అవిక్రియము, సద్ఘనము, చిద్ఘనము, నిత్యము, ఆనందఘనము, అవ్యయము, ప్రత్యగేకరసము, పూర్ణము, అనంతము, అనుపాధేయము, అనాధేయము, ఆశ్రయశూన్యము అవుతుంది.

ఆ పరబ్రహ్మ నిర్గుణము, క్రియారహితము, సూక్ష్మము, నిర్వికల్పము, నిరంజనము, అనిరూప్య స్వరూపము, మనోవాచామగోచరము, సత్ సమృద్ధము, స్వతఃసిద్ధము, శుద్ధము, బుద్ధము, అనీదృశము. ఆ బ్రహ్మము ఒక్కటిగా అద్వయముగా ఉన్నది. పరబ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు.

మహావాక్యాలను శ్రద్ధగా విని వాటిని అర్ధం తెలుసుకుని మననం చేసి వాటిని గనక అనుసంధానం చేసినట్లైతే సాధకుడు తానే సంగరహితుడు, అంగరహితుడు, లింగరహితుడు, ప్రశాంతుడు, అనంతుడు, పరిపూర్ణుడు, చిరంతరుడు, అకర్త, అభోక్త, అవికారుడు, అవ్యయుడు, శుద్ధ బుద్ధ స్వరూపుడయిన పరమాత్మ అవుతాడు.

# 8. ఫలశ్రుతి

ఇప్పటిదాకా చాలా కష్టపడి మహావాక్యాలను గురించి తెలుసుకున్నాం. వాటిని ఏ విధంగా ఉపాసన చెయ్యాలో, వాటికి షడంగాలేమిటో, వాటి అర్థమేమిటో అన్నీ తెలుసుకున్నాం. ఇప్పుడు చిన్న అనుమానం. దీనివల్ల ఫలితం ఏమిటి? ఇప్పుడు ఆ విషయాన్ని చూద్దాం. మహావాక్యాల శ్రవణము, మననము, ఉపాసనల వల్ల ఫలితము జన్మరాహిత్యము. మరుజన్మ ఉండదు. ఇప్పుడు మళ్ళీ అనుమానం. ముక్తి పొందిన వారికి, మోక్షం పొందిన వారికి ఇద్దరికీ మరుజన్మ ఉండదు కదా ! మహావాక్యాలను ఉపాసన చేస్తే మనకు వచ్చేది ఏమిటి? ముక్తా, మోక్షమా? ఇప్పుడు ఈ రెండింటినీ వివరంగా చూద్దాం. మొదటగా ముక్తి.

**ముక్తి :** ముక్తి అంటే విముక్తి. లౌకిక బంధాల నుంచి విముక్తి అరిషడ్వర్గాలు, కామక్రోధాలు, రాగద్వేషాలు, ప్రేమ, అభిమానం, ఆప్యాయత, అనురాగం, ద్వేషం మొదలైన వాటి నుంచి విముక్తి.

పరబ్రహ్మను రెండు రకాలుగా ఉపాసించటం జరుగుతుంది 1. సాకారోపాసన 2. నిరాకారోపాసన.

**1. సాకారోపాసన :** పరబ్రహ్మ నిరాకారము, నిర్గుణము అంటే దాన్ని ఉపాసించటం కష్టం. నిరాకారం మీద దృష్టి నిలవదు. అందుచేత **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా** మన కోరికలు తీరటం కోసం ఆ పరమేశ్వరుడికి ఒక రూపాన్ని కల్పించి, ఆ రూపాన్ని ఉపాసిస్తాం. దాన్నే **అపరబ్రహ్మ** అంటారు. దైనందిన జీవితంలో అపరబ్రహ్మను 1)శ్రీమన్నారాయణుడు 2)శ్రీమహావిష్ణువు 3)శ్రీకృష్ణుడు 4)శ్రీరాముడు 5)నారసింహుడు 6)ఈశ్వరుడు 7)శక్తి (అమ్మవారు) ఇలా పరబ్రహ్మకు ఒక రూపం కల్పించి మోక్షాన్నిచ్చే దేవతగా దాన్ని ఉపాసించటం జరుగుతుంది. ఇదే సాకారోపాసన. ఈ రూపమే అపరబ్రహ్మ. ఈయన ఉండే ప్రదేశమే పరమపదము ఉత్కృష్టమైన చోటు. ఇతరులెవ్వరూ చేరలేని చోటు. అపరబ్రహ్మను చేరాలంటే కావలసింది భక్తి, తాదాత్మ్యత, తత్పరత. ఇక్కడ అన్నింటినీ వదిలేసి శరణాగతి పొందాలి అటువంటి వాడు మరణానంతరము అర్చిరాది మార్గం గుండా

పరమపదము చేరతాడు. ఈ పరమపదంలో అపరబ్రహ్మ ఉంటాడు. ఇది వివిధ పేర్లతో పిలువబడుతుంది.

వైష్ణవులకు పరమపదము – వైకుంఠము. శ్రీమహావిష్ణువు అక్కడే ఉంటాడు. అలాగే మిగిలిన వారు కూడా.

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమన్నారాయణుడు | – | శ్వేతద్వీపంలో |
| 2. | శ్రీమహావిష్ణువు | – | వైకుంఠంలో |
| 3. | శ్రీకృష్ణ పరమాత్ముడు | – | గోలోకంలో |
| 4. | ఈశ్వరుడు | – | కైలాసంలో |
| 5. | అమ్మవారు (శక్తి) | – | మణిద్వీపంలో ఉంటారు. |

ఇదే పరమపదము. వారి దృష్టిలో దీన్ని కన్న అధికమైన చోటులేదు. మరణించిన తరువాత మహాయోగి యొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. ఉత్క్రమించటము అంటే నవరంధ్రాలలోను ఏదోఒకమార్గం గుండా బయటకి పోవటం నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం ద్వారా బయటకు వెళ్ళిన జీవికి మరుజన్మ ఉంటుంది. జన్మరాహిత్యం జరగాలంటే జీవాత్మ వచ్చిన మార్గం ద్వారానే బయటకు వెళ్ళాలి. జీవాత్మ మానవశరీరంలోకి ఎలా ప్రవేశించింది? అంటే **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహాన్ని సృష్టించిన తరువాత, ఈ దేహంలో తాను లేకపోతే ఎలా? అనుకుంది పరమాత్మ. వెంటనే బ్రహ్మరంధ్రం గుండా దేహంలో ప్రవేశించి, నవరంధ్రాలతోను అన్ని రకాలైన సుఖాలు అనుభవిస్తూ, తాను పరమాత్మను అనే విషయంతో పాటుగా, వచ్చిన మార్గం కూడా మరచిపోయి పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలో బందీ అయిపోయి, దేహం చేసే కర్మలన్నింటికీ కర్తా, భోక్తా రెండూ నేనే అని భావిస్తూ పూర్తిగా అజ్ఞానంలో కూరుకుపోయింది. అజ్ఞానం పూర్తిగా వదిలిపోతేనే కాని తాను ఈ దేహంలోకి ఎలా ప్రవేశించాననే విషయం గుర్తు రాదు. జన్మరాహిత్యం కావాలంటే వచ్చినమార్గం గుండానే, అంటే బ్రహ్మరంధ్రం గుండానే బయటకు రావాలి. అలా బ్రహ్మరంధ్రం గుండా బయటకి వచ్చిన జీవాత్మ ముందుగా సూర్యలోకం చేరుతుంది. బ్రహ్మలోకానికి తలవాకిలి

(సింహద్వారం) సూర్యలోకం. అక్కడి నుంచి అర్చిరాదిమార్గం ద్వారా అపరబ్రహ్మ ఉండే పరమపదం చేరుతుంది. దాన్నే బ్రహ్మలోకము అంటారు. అక్కడ 500 మంది అప్సరసలు అతడికి స్వాగతం చెబుతారు, సుగంధ ద్రవ్యాలు వంటికి రాస్తారు, చక్కగా బ్రహ్మదేవుని లాగానే అతణ్ణి కూడా అలంకరిస్తారు. ఇప్పుడు అపరబ్రహ్మ అతణ్ణి కొన్ని ప్రశ్నలు అడుగుతాడు. వాటన్నింటికీ ఇతడు సమాధానం చెబుతాడు. అప్పుడు **'నేను అనుభవించే మహదైశ్వర్యాన్నే మీరు కూడా అనుభవిస్తూ, ఇక్కడే ఉండండి'** అంటాడు అపరబ్రహ్మ. అప్పటి నుంచి ఈ జీవుడు సూక్ష్మశరీరం పొంది, అక్కడే పరమపదంలో జరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధ ఉత్సవాలు తిలకిస్తూ, ఆ పరంధాముణ్ణి సేవిస్తూ అలా కల్పాంతం వరకు ఉండి, కల్పాంతాన అపరబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతాడు. ఇది క్రమముక్తి.

పరమపదంలో ఉండే మహదైశ్వర్యము అంటే – బ్రహ్మానందము. లోకంలో విద్యావంతుడు, ధనవంతుడు, అనుభవించాలనేకోరిక ఉన్నవాడు, బలము ఆరోగ్యము ఉన్నవాడు పొందే ఆనందాన్ని మానుషానందము అంటారు.

| | |
|---|---|
| మానుషానందానికి నూరు రెట్లుంది | – మానవ గంధర్వానందం |
| మానవ గంధర్వానందానికి నూరు రెట్లుంటుంది | – నిజగంధర్వానందం |
| నిజగంధర్వానందానికి నూరు రెట్లుంటుంది | – చిరలోక పితరానందం |
| దానికి నూరు రెట్లుంటుంది | – అజానజదేవానందం |
| దానికి నూరు రెట్లుంటుంది | – కర్మదేవానందం |
| దానికి నూరు రెట్లుంటుంది | – నిజదేవానందం |
| దానికి నూరు రెట్లుంటుంది | – ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరు రెట్లుంటుంది | – బృహస్పతి పొందే ఆనందం |
| బృహస్పతి పొందే ఆనందానికి నూరు రెట్లుంటుంది | – ప్రజాపతి పొందే ఆనందం |
| ప్రజాపతి పొందే ఆనందానికి నూరు రెట్లుంటుంది | – బ్రహ్మానందం |

అంతకు మించిన ఆనందం లేదు. అది పరమోత్కృష్టమైనది. ఇక్కడ తెలుసుకోవలసిన విషయం ఒకటుంది. పరమపదంలో కష్టాలు, కన్నీళ్ళు, దుఃఖము, ఈర్ష్య, అసూయ, ద్వేషము, రాగము వంటివి ఏవీ ఉండవు. అక్కడికి చేరిన జీవుడు ఇవిఏవీ లేని స్థితిలో ఉంటాడు. ఎప్పుడైతే రాగద్వేషాలు మొదలైనవి లేవో, అప్పుడు మిగిలేది ఒకటే – ఆనందం. అదే బ్రహ్మానందం. ఏతావాతా తేలింది ఏమంటే కష్టాలు, కన్నీళ్ళు, బాధలు, ఏవీలేని స్థితే బ్రహ్మానందము. అదే మహదైశ్వర్యము. అక్కడికి చేరిన పవిత్రాత్మ కూడా బ్రహ్మానందాన్ని అనుభవిస్తుంది. అదే మహదైశ్వర్యాన్ని అనుభవించటమంటే. ఇలా కల్పాంతం వరకు అక్కడే ఉండి, కల్పాంతన పరబ్రహ్మలో లీనమవుతుంది.

పరమపదం చేరిన ఆత్మపురుషుడికి కొన్ని శక్తులు వస్తాయి. అతడు కోరుకున్న లోకాలకు వెళ్ళగలడు. అందుకే అతడు మాతృలోకాలకు, పిత్రులోకాలకు, గంధమాధన లోకాలకు, సూర్యలోకానికి, చంద్ర లోకానికి ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్లగలడు. వీటినే పవిత్రాత్మలు అంటారు. వీటిలో కొన్ని సదా ఆకాశంలో చరిస్తూ, అర్హులైన వారు ఈ లోకంలో మంచి పనులు చెయ్యటానికి సహకరిస్తుంటాయి. వీరిలో మరికొన్ని సర్వకాల సర్వావస్థల యందు పరబ్రహ్మను అంటిపెట్టుకుని ఉంటాయి. వీరిని నిత్యముక్తులు అంటారు.

వైకుంఠంలో – లక్ష్మీదేవి, గరుడుడు, ఆదిశేషుడు, నారదుడు మొదలైన వారు ఈ కోవకు చెందినవారే. అదే కైలాసంలో – నంది, భృంగి, శృంగి మొ॥ వారు, మణి ద్వీపంలో కామేశ్వరి వజ్రేశ్వరి, భగమాలిని మొదలైన వారంతా నిత్యముక్తులే. అవసరమనుకున్నప్పుడు వీరు శరీరాన్ని ధరించి భూలోకంలో అవతరిస్తుంటారు. అయితే శరీరాన్ని పొందిన తరువాత ఆ శరీరంతో చేసే కర్మలన్నింటికీ వీరే బాధ్యత వహించాలి. పూర్వకాలంలో నారదుడి శాపం వల్లనే శ్రీమహావిష్ణువు శ్రీరాముడిగా జన్మించాడు. శ్రీరాముడు చెట్టు చాటు నుంచి వాలిని చంపినందుకే శ్రీకృష్ణుడిగా జన్మించి, బోయవాడి చేతిలో మరణించాడు. కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులందరూ మరణించారనే బాధని తట్టుకోలేక, కడుపుమంటతోనే 'యాదవవంశం నీ కళ్ళ

ఎదురుగానే నాశనమవుతుంది?' అని శ్రీకృష్ణుడికి శాపం పెట్టింది గాంధారి. కాబట్టి ముక్తి పొందిన వారు మళ్ళీ శరీరం ధరించి కర్మలు చేస్తే, ఆ కర్మ ఫలితాన్ని వారే అనుభవించాలి అనుభవిస్తారు. ఇందులో సందేహం లేదు. ఈ ముక్త పురుషుడు ఒకే సమయంలో వివిధ ప్రదేశాలలో కనిపించ గలడు. శ్రీకృష్ణ పరమాత్ముడు ఒకేసారి పదహారు వేల మంది గోపికలతో రాసక్రీడలు జరిపాడు. కాని ఒక్క విషయం ఏమంటే ముక్తాత్మ సృష్టి మాత్రం చెయ్యలేదు. సృష్టి స్థితి లయాలు పరమేశ్వరుడు చేసేపని. ఇతరులెవ్వరూ చెయ్యలేరు.

ఈ రకంగా ముక్తపురుషుడు బ్రహ్మలోకం చేరి, మహదైశ్వర్యాన్ని అనుభవించి, కల్పాంతన పరబ్రహ్మలో లీనమవుతాడు. వీరికి మరుజన్మ ఉండదు. దీన్నే క్రమముక్తి అని కూడా అంటారు. ముక్తి 1. సార్ష్టిరూపముక్తి 2. సాలోక్యముక్తి 3. సామీప్యముక్తి 4. సారూప్యముక్తి 5. సాయుజ్యము అవి ఐదు రకాలు. వీటిలో సాయుజ్యం పొందిన వారికి మాత్రమే మరుజన్మ లేదు. మిగిలిన వారందరూ ఈ లోకంలో ఉత్తమయోనుల యందు మళ్ళీ జన్మిస్తారు.

**2. నిరాకారోపాసన :** సాకారోపాసన చేసేవారు మరణానంతరము అర్చిరాదిమార్గం గుండా బ్రహ్మలోకం చేరి కల్పాంతం వరకు అక్కడే మహదైశ్వర్యాన్ని అనుభవించి, కల్పాంతన అపరబ్రహ్మతో పాటు పరబ్రహ్మలో లీనమవుతారు. మరి నిరాకారోపాసన చేసిన వారి సంగతి ఏమిటి? **మరణ సమయంలో జీవుడు దేన్ని గురించైతే ఆలోచిస్తుంటాడో, మరుజన్మలో దాన్నే పొందుతాడు**. భాగవతంలో జడభరతుడు మరణ సమయంలో లేడిపిల్లను గురించి ఆలోచించి, మరుజన్మలో లేడిగా పుట్టాడు. పురంజన మహారాజు స్త్రీ లోలుడై మరుజన్మలో స్త్రీగా జన్మించాడు. సాకారోపాసన చేసిన వారు మరుజన్మలో సాకారాన్నే పొందుతారు. నిరాకారోపాసన చేసిన వారు మరణ సమయంలో నిరాకారుడైన పరబ్రహ్మను గురించే ఆలోచిస్తారు. కాబట్టి వారికి మరుజన్మ నిరాకారమే అవుతుంది. అంటే మరుజన్మ ఉండదు, ఇదే మోక్షము. వీరి జీవాత్మ, పరమాత్మ ఒకటై పోతాయి. బ్రహ్మరంధ్రం గుండా బయటకు రావటం వరకు సాకారోపాసకులకు, నిరాకారోపాసకులకు మార్గం ఒకటే.

బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు రాగానే సాకారోపాసకులు అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరతారు. అయితే అలా ప్రయాణం చెయ్యటానికి నిరాకారోపాసకులకు ప్రత్యేకమైనమార్గం ఏదీఉండదు. నిరాకారుడైన పరబ్రహ్మకు ప్రత్యేకంగా ఏ లోకము లేదు. ఆయన చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కాబట్టి నిరాకారోపాసకుడు బ్రహ్మరంధ్రం గుండా బయటకు రాగానే పరబ్రహ్మలో లీనమై పోతాడు. అదే సాయుజ్యము, మోక్షము అనబడుతుంది. ఇతడికి మరుజన్మ ఉండదు.

ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమంటే సాకారోపాసకుడు ముక్తి పొందితే, నిరాకారోపాసకుడు మోక్షం పొందుతాడు. సాకారోపాసకుడు అంగుష్టమాత్ర దేహంతో అపరబ్రహ్మను సేవిస్తుంటాడు. కాబట్టి అతడికి అస్థిత్వము ఉన్నది. ఈ కారణం చేతనే అతడు కావాలనుకుంటే దేహం ధరిస్తాడు. మాత్రులోకాలు, పిత్రులోకాలు, భాత్రులోకాలు ఎక్కడికి కావాలనుకుంటే అక్కడికి వెడతాడు. లోకాలను ఉద్ధరించటానికి ప్రయత్నిస్తాడు. ఒకే సమయంలో అనేకచోట్ల కనిపిస్తాడు. భాగవతంలో ధనుర్యాగానికి వస్తున్నప్పుడు అక్రూరుడికి కృష్ణుడు అలాగే కనిపించాడు. కాని ఇతడికి జగస్పృష్టి చేసే శక్తిమాత్రం ఉండదు. ఇతడు బ్రహ్మలోకంలో ఉన్నంతవరకు మహదైశ్వర్యాన్ని (బ్రహ్మానందాన్ని) అనుభవిస్తాడు.

కాని నిరాకారోపాసన చేసిన వాడికి ప్రత్యేకంగా అస్థిత్త్వము ఉండదు. దేహపాతం జరిగిన మరుక్షణమే, అతని జీవాత్మ పరమాత్మతో చేరిపోతుంది. కాబట్టి ఇతడు ఏ లోకాలకు వెళ్ళలేడు. పరమాత్మతో కలిసి చరాచర జగత్తును ఆక్రమించి ఉంటాడు. అందుకే అతడికి నామరూపాలతో పాటగా మరుజన్మ కూడా ఉండదు.

ఇక్కడ గమనించాల్సింది ఏమంటే, **ముక్తి పొందిన వారికి, మోక్షం పొందిన వారికి ఇద్దరికీ మరుజన్మ ఉండదు.**

మహావాక్యాలు మననం చేస్తే ఫలితం ఏమిటి ? అంటే చరాచర జగత్తులో పరమాత్మ ఒక్కడే సత్యము, నిత్యము, శాశ్వతము అయినవాడు. మిగిలిన జగత్తంతా మిధ్య. జగత్తులో ఉన్నది పరబ్రహ్మ ఒక్కటే. అదే నేనే **నేనే పరబ్రహ్మను. పరబ్రహ్మమే నేను** అని భావిస్తాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** బ్రహ్మను గురించి తెలుసుకున్న

వాడు కూడా బ్రహ్మమే అవుతాడు. తానే పరబ్రహ్మ అని తెలుసుకున్న మహాజ్ఞాని పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అదే మోక్షము. ఈ రకంగా జ్ఞాన సముపార్జన చేసిన వారికి పునర్జన్మ లేదు. ఇదే విషయాన్ని వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రాలలోని ఆఖరు సూత్రంలో **అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్** అంటూ వివరించాడు. కాబట్టి **మహావాక్యాల శ్రవణ మననాల వల్ల ఫలితము మోక్షము.**

--x--

శ్రీ క్రోవి పురుషోత్తమశర్మ, శ్రీమతి లక్ష్మీనరసమ్మ గార్ల పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి, శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ గార్ల జ్యేష్ఠపుత్రుడు హరితస గోత్రీకుడు, **పరమానందనాథ** దీక్షానామధేయుడు అయిన **డా॥ క్రోవి పార్థసారథి** సర్వజనామోదముగా సులభశైలిలో వ్రాసిన **మహావాక్యములు** అనే ఆధ్యాత్మిక గ్రంథము సమాప్తము

సర్వేజనాః సుఖినోభవన్తు
సమస్త సన్మంగళానిభవన్తు
ఓం తత్సత్